

# మేఘన

కందుకూరి రామభద్రరావు



గొల్లపాలెముపారుల
సన్మానోత్సవ ప్రచురణము

చిత్రభాను : ఆషాఢ

చిత్రకారులు

శ్రీ వరదా వెంకటరత్నముగారు



సర్వస్వామ్యములు

కవివి

మొదటి కూర్పు

జూన్, 1942



వెల

రూపాయి

నీ కవితాతరంగిణి జనించిన కల్వాల నాంధ్రవాఙ్మయ
శ్రీకబరీభరమ్ము కయిసేసిన కావ్యకళాకలాపసం
ధాకుశలుండవౌ కవివతంస! త్వదున్నతకీర్తి సౌధపున్
వాకిట వ్రేలుబో తెలుగువారిదు మంగళతోరణా
లికన్

తెలుగు జాతీయపుందీరుదీయదనము
జీవకళలూరు నీ కావ్యశిల్పమునకు
నాటి నేటి కవీశానకోటి పూల
వాన కురియునుబో! రామభద్రరాయ!

వేదుల

# రెండుమాటలు

'దేశము బాగుపడవలె నంటే పల్లెటూళ్లను మంచి స్థితికి తేవలెను' అని చాలామంది ఉపన్యాసా లిస్తారు. గ్రంథాలు వ్రాస్తారు. పెద్దపెద్ద ప్రణాళికలు తయారుచేసి ప్రకటిస్తారు. కాని ఆచరణకు పూనుకొని శ్రమపడే కార్యశూరులు మాత్రము ఎంతోమంది ఉండరు. ఈపని చేయవలసినవారు విద్యాధికులు. వారునుకవాసులు. వారివిలాసజీవితానికీ, అలవాట్లకూ గ్రామాలలో చోటు దొరకదు. అందుచేత పట్టణాలనువిడిచి పల్లెలకు రావడమునకు వారు ముందంజ వేయరు. ఎవరైనా అందుకు సిద్ధపడినా, గ్రామాలలోని ప్రస్తుతజీవిత విధానము వారికి అడుగడుగునా ఎన్నో ఆటంకాలు తెచ్చిపెట్టుతుంది. ఎంతో సహనమూ, సౌశీల్యమూ ఉన్నవారే ఆ ఆటంకాలనుఅన్నిటినీ దాటిప్రజలఆదరాభిమానాలను సంపాదించి పల్లెలలో నిలబడి పనిచేయగలుగుతారు. ఆవిధముగా పనిచేస్తున్నవారిలో రామభద్రరావుగా రొకరు.

రామభద్రరావుగారికి పల్లెలన్నా, పల్లెప్రజలన్నా వారికి సేవ చేయుడమన్నా చాలా ఇష్టము. చాలా కాలమునుంచి ఆయన ఎన్నోవిధాల గ్రామోద్ధరణకై పూనుకొని పనిచేస్తున్నారు. పల్లెలలోని జీవితవిధానము మారవలెను, కక్షలు నశించి ఐకమత్యము ఏర్పడవలెను. జాతీయసాంప్రదాయము లందు అభిరుచి కలగవలెను. పూర్వములాగున ఇప్పుడు శిల్పకళలను పోషించే రాజులు లేరు గనుక ఆభారమును పల్లెటూళ్ల ప్రజలే వహించవలెను. అప్పుడు కాని దేశము బాగుపడదు. అనే తలంపుతో ఆయన కృషి చేస్తున్నారు. దానికోసమే పల్లెటూరిలో ఉపాధ్యాయుడుగా పనిచేయడానికి కూడా ఆయన సిద్ధపడ్డాడు.

రామభద్రరావుగారు మా గొల్లపాలెముస్కూలుకు హెడ్మాష్టరుగా వచ్చి పణ్ణాళ్ధమే అయింది. అదేమి విచిత్రమోకాని వారిని చూచినప్పటినుంచి ప్రజలకు వారిమీద ఎక్కడా, ఎన్నడూ లేని భక్తి శ్రద్ధలు ఏర్పడినవి. ఈస్వల్పకాలములోనే ఆయన మాగొల్లపాలెము ప్రజలకే కాకుండా, చుట్టుపట్ల

గ్రామాదులలోని చిన్నలకూ పెద్దలకూ
రికీ, నైతికముగా, సాంఘికముగా, రాజకీయము
ఆచార్యస్థాన మైనారు. ఆయన ఉపన్యాసాలవ
చేస్తున్నకృషివల్లా, ప్రజల జీవితములోను,
రుచులలోను విశేషమైన మార్పు కలిగింది. ఆ
ఏం తలపెట్టినా ప్రజలు మహోత్సాహము
పూనుకొని పనిచేశారు. ఆయన ఏది చెప్పినా
సావహించి ఆలా నడిచారు. ఈకొద్దికాల
లోనే ప్రజలంటే ఆయనకు ప్రేమా, ఆయన
ప్రజలకు భక్తిగౌరవములూ బలపడిపోయి
అందువల్ల ఏవిధముగానయినా సరే రామభ
రావుగారిని సన్మానించి తమకున్న కృతజ్ఞత
భక్తిగౌరవాలనూ, వెల్లడించాలని ప్రజలు
యించారు. ప్రవాహము పొంగిన తర్వాత ద
అడ్డు ఏముంటుంది?

అయితే రామభద్రరావుగారిది వింత ప్రక
ఆయన ఏదిచేసినా తనకర్తవ్య మనుకొనే చేస్తా
తాను చేసినదానికి ప్రతిఫలాన్ని గాని, గౌ
సన్మానాలనుగాని. అధికారాన్ని గాని ఆయన

క్షించడం. అందుచేత ఈవిషయాన్ని ఆయనకు తెలి యజేసి మేము చేసే సన్మానానికి ఆయనను ఒప్పిం చడానికే పెద్దలు దిగివచ్చారు. మాగొల్లపాలెము భాగ్యము పండి చివరకు ఎంతమందో చెప్పి ఎంతో బలవంతపెట్టిన మీదట ఆయన మాసన్మానానికి అంగీకరించారు.

ప్రకటన కోరని నిరాడంబరుడు కావడమువల్ల ఆయనలో ఎన్నిశక్తు లున్నవో తెలుసుకోవడము కష్టము. ఆయన ప్రజాసేవకుడు. ప్రజలభావాలను ఉత్సాహతరంగితములుగా చేసే ఉపన్యాసకుడు.

తెలుగుతోటకు చక్కదనాలపత్తాముత్తినకవి.

ఆయన రచియించిన ఖండకావ్యాలను అన్నిటినీ ఒక సంపుటముగా ప్రచురించి ఆయనకుసమర్పించి సన్మా నించడము ఆయనలోనిశక్తులను అన్నిటినీ సన్మా నించినట్లు అవుతుందని నిశ్చయించాము. ఈనిశ్చ యము కార్యరూపము తాల్చడానికి ఎంతోకాల ముపట్టలేదు. ప్రజలు యావన్మంది సంతోషోత్సా హాలతో కార్యనిర్వహణానికి పూనుకొన్నారు.మా కోరిక ఫలించింది.

రామభద్రరావుగారు మామిత్రుడు. మాగురువు. ఆయన ఎక్కడున్నా మేము ఆయనను మరిచిపోలేము. ఆయన మమ్మలినిమరిచిపోలేదు. మాఅన్యోన్యము అటువంటిది. ఆయనను ఈవిధముగా సన్మానించగలగడము మాభాగ్యము. మా సన్మానానికి ఒప్పుకోవడము ఆయన ఔదార్యము. కీర్తి ధన సంపాదనకై కవితాశిల్పాన్ని వినియోగించని ఈమహామహుని రచనలను ప్రకటించడము, ఆయనను, ఆయనకృషినీ, ఆయనమంచితనాన్ని, ఆయన కావ్యశిల్పమునూకూడా సన్మానించడమే అభిమానమ్మకము. ఇంతకన్న చెప్పవలసినది ఏమున్నది? ఈ కవి సన్మానము ఆయన మాలో నాటిన విజ్ఞానవృక్షానికి ఫలము. ఈతొలిఫలమును ఆయనే రుచిచూడడముకన్నా మాకు మరొకభాగ్యములేదని వారులందరిపక్షాన మనవిచేస్తున్నాను నేను.

గొల్లపాలెము,
22-6-'42

కోకా రాఘవరావు
పంచాయతీబోర్డు ప్రెసిడెంటు

శ్రీకర మ్మయి,సకలయాశీఃప్రద మయి,
నిఖిలభువనబోధనరతోన్నిద్రము నయి,
విశ్వసృజ ముఖమంటపపీఠి నిలిచి
కొలువుదీర్పు వాగ్దేవి కంజలి ఘటింతు



ఇది మహోదధి చలియించు నెగసి పొగసి
కళపెళ నుడుకుకరడుల, నులివు వెడలు
పవలు రేలొక్క ఘోషగా, ఎవరో దీని
కదపి రెప్పుడో! ఏనాడు కనునో శాంతి!

స్వార్థపరజీవికలు కూర్చు సంతసమున
గడుసుజాలరు లెందరో పడవ లెక్కి
పెరిగి విరిగెడు కెరటాల నురువు లందు
పడుచు లేతురు చేతిలో వలలు చిమ్ము

ముందు వెనుకలు చూడని చిందు త్రొక్కి
పడుచుపిల్లలు పరుగుసందడుల తోడ
నాల్గువన్నెలు చెదరెడి నత్త లేరి
మురిసిపోదురు తరగలు మొరయు చోట

చిరతరధ్యానపరత గృశించిపోయి
ఈ మహాసముద్రతటాన నెవర వయ్యా
స్థిమితపద్మాసనమున వీక్షింతు విటుల
కనుల జ్యోతులు వెలుగగా కడలి చీల్చి

బయలి కల్లోలఘోష లావలకు ద్రోసి
కాంచెదవొ నీవు వారాశిగర్భ మందు
చెలగు బాడబవేదనాశిఖల కొసలు
కీల లందున కదలు రత్నాలఖనులు

నా జీవితాంబుజము

నవనవోన్మిషితమై

యింతశోభల తోడ

వికసించునో యేమొ!

—బి.

# శంక

ఎన్నేని శక్తులే
నిచ్చినావో దేవ
వినియోగమే లేక
కునికిపోవునో యేమొ!

సాధనాసుఖములో
సంగీతమున పొంగు
వీణాగళస్వనము
వెలితిబడి పోయినది.

చేపట్టి జీవకళ
చిత్రింపగల తూలి
ధూళిధూసరితమై
దొరలు నే మూలనో

వెలుగు చీకటి నేత
వలువ తెర యడ్డమై
బెడదలో శోకింతు
ఎడదలో నాశింతు

ఏ నాడు తెరజారి
నీ నాడెమును జాటి
వీణ నే పలికింతునో
విశ్వమ్ము జిత్రింతునో

# పడవ

ఎంత చిత్రము స్వామి
ఈ పడవ నడక
బ్రతుకు సంద్రము పైని
పయనించు నెచటికో!

తెరచాప పరువులో
కెరటాలపై దూకి
ఇంద్రకార్ముకరుచుల
నిరుప్రక్కలను జిమ్ము

రాకపోకలు తెలియ
రాక రేగు తుపాను
నడిలోన బడిలేచి
నడయాడు నింగిపై

ఎంత వడిదుడుకైన
ఏ యానకోలలో
సన్నసన్నగ లాగి
సాగించు పయనమ్ము

✱

ఏ తార లక్ష్యమో!

ఏ సీమ గమ్యమో!

ఏన? నీవా? నడప

ఈ పడవ పయనించు.

# కోర్కె

హోరుమని వీచు పెనుగాలి కోర్వ లేక
కళవళంపడు కటికచీకటుల నడుమ
బెదరుగుండెల నరచేత నదుము కొనుచు
ప్రాకు లాడెద రెందరో పాంథు లకట!

పాదచారుల కుపకరింపగ దలంచి
నాదు జీర్ణకుటీరాంగణమ్ము నందు
వ్రేలదీసిన దీపిక వెలుగు కూడ
ఆగికోలేక రెపరెప లాడి పోయె.

గాలి రవ్వంత సోకని మూల చూచి
దాచు కొన్నాను దీపంబు; దాని ప్రక్క
ముడుచుకొని పోయి గుడిసెలో మూల్గుచుంటి
స్వార్థము త్యజింప లేని దుర్బలుడ నగుట.

కలగు పాంథుల కొక్కింత వెలుగు నూపి
సాయపడ గల యుత్సాహసాహసమ్ము
లిగిరి పోవునా! కృపతోడ మిగుల నిమ్ము
జాలిఁ గన్నీరు కార్చెడి శక్తి యేని.

## తొలకరి

ఇంగలమ్మొగబోయు వేసంగినాళ్ల
నార్చుకొనిపోయి పెనుబీట లారె యెడద
ఆపుకోలేని తాపాన నడలిపోతి
పొడికనుల నశ్రుకణమైన బొడమరాక.

ఇంత చల్లని గాలితో నీ సువృష్టి
హృదయ మంతయు బదనువారినది దేవ!
పులకరింతలు నూల్కొన బొటమరించు
నూత్నజీవాంకురమ్ము లనూనశక్తి.

గరికపోచైన మనరాక కాలిపోవు
నెడద తృటిలోన నిండారె నింతశోభ
ఇంక వర్షాగమమ్మయి, ఏపు మిగిలి,
ఎంతసుందరోద్యానమై యిట ఫలించో!

# అనుబంధము

ప్రొద్దుపొడుపున నీరెండపొలుపు లొదుగ
నడుగు లిడివచ్చి, లేతప్రాయంబునందు
ఆడుకొను చేను పాటలు పాడుకొనుచు
ఎన్నిసారులో నీ హర్మ్య మెక్కినాను

శాంతసుందరనయనప్రసాదవీక్ష
ణముల హృదయంబు పొంగగా నాట్య మాడి
పిన్ననగవుల కెరటముల్ ప్రిదిలి మొరయ
అంకపాళిని గేలింత లాడినాను

ఏండ్లు గడవగ బోధించి రెవరో కాని
నీవు రాజాధిరాజుగా, నిఖిలభువన
శాసనోద్దండదండదోస్సారుగాఁగ,
వేదవేదాంతశాస్త్రసంవేద్యుఁగాఁగ

అంత భయమేదో హృదయాన నంకురించి
నీదు ప్రాసాదవీధినే పాద మిడగ
మానుకొన్నాను, గాని నా మానసంబు
మాటిమాటికి నీ వైపె మసలు స్వామి.

## స్వోత్కర్ష

నా కలమ్మున తీవ్రత నాస్తి యంట
నా పలుకులందు లోతులు నాస్తి యంట
నాదు రూపున నవ్యత నాస్తి యంట
నా యమాయకహృదయమే నవక మంట

నా కదే చాలు; పదివేలు; నా యెడంద
మందమలయానిలాంకురస్పందనమున
కైన గందెడి సౌకుమార్యము వహించి
నీ పదాంకితమైపోయి నిలువ నిమ్మ

అపుడు నా కల మమృతనిష్యంది యగును
అపుడు నా పల్కు వేదభాష్యమ్మె యగును
అపుడు నా రూపు నందనోద్యానమగును
ఏమి లేదన్న నాకేమి స్వామి యింక

# గడ్డిపూవు

గడ్డిపూవును నేను; లోకమ్ము నందు
నాదు వంగడమునకు మన్ననలు లేవు
ఈశ్వరోద్యానవనపాళి నేదొ మూల
విడిచి వికసించి బ్రదుకంత వెడలబోతు

అహరహము పెంచి కుటిలదోహదముతోడ
ధనమదాంధుల కధికారదర్పకులకు
దాస్యచిహ్నాగ గపటమోదమ్ము కొరకు
త్రుంచి యర్పించు కోత భరించు టెటులు?

నాగరకలోకవికటసన్నాహమునకు
నలిగిపోయెడి హైన్యత నాకు లేదు
తరుణకాముకహృదయసంధానమునకు
దూతికాకృత్య హైన్యత దూగలేను.

అవసరము తీరి, లోక మనాదరమున
విసరివైవగ, కాళ్ళను వ్రేళ్ళ బడుచు
కర్కశోపలగండభాగముల వాడి
వేడగా లేను జీవితభిక్ష కొరకు

సంతతము శోక లోకభాస్కరునికిరణ
మెడద నునువెచ్చనై ద్రవియించిపోవ
ఒంటరిగ మందమలయానిలోర్ములందు
ఆడిపోవుదు నాత్మసౌఖ్యమ్ము విరియ

# ఆత్మగౌరవము

తెలిసికోలేక యే శుభంబులకు నన్ను
ఈ మహాసృష్టిలో సృజియించి నావొ
పనికి మాలిన జీవిత భార మనుచు
పాంసుపటలిలో నిందించి పారవైతు

జీవితోల్బణకారకశ్రీలు పొదిగి
పెంచికొనివచ్చు కుసుమంబు వితథ యగునె
అడవి లోపల పొదలలో విడుపు గనిన
పరిమళంబులు పెనుగాలి పాలబడిన

కార్యకారణసంబంధగణన తోడ
కొండ కెగబ్రాక నిచ్చెన కొరకు తడవు
శాస్త్రవేత్తల మేధస్సు చాల బోదు
ప్రకృతిజీవితపరిణామఘటితు లెరుగ

నాదు బ్రతుకున నవజీవనదులు పారు
నా వికాసాన నవశోభ నాట్యమాడు
నాదు జీవితపరమార్థ మేదొ నిలుచు
ఏనె మన్నించు వెరవు గ్రహింప లేను

## నిరాశ

తొడిమపట్టున నూగు పూవడతి వోలె
నీదు ప్రేమానుబంధము నూది యుంటి
ఏ నిరాశాపవనహతి కేని గాలి
నిష్ఫలమ్మయి ముగియునో నియతయాత్ర.

## నిస్పృహ

ముప్పదివసంతముల పైని మొగ్గ నేను
విశ్వసమ్మోదకరమగు వికసనమున
భారతోద్యానమున సౌరభములు నింప
కోరకించితి పొంకంబు కూడ బెట్టి.

ఈ తమస్విని ధరియించి హిమపటంబు
కాన నీయదు భావివికాససిద్ధి
త్రోసికొనివచ్చు వికసనోత్సుకత యంత
నా జఠరవలభి పడి జీర్ణమ్మె యగునో!

# వీణ

పసిడికిన్నెరవీణ
పాడుకొను మన్నావు
పస నెరుంగని నేను
పలికింపనే లేదు

పాటసొమ్ముగ మరచి
ఆటబొమ్మగ వలచి
ఆవంక యీవంక
అదలించి త్రోశాను

సున్నితముగా వాడ
మన్ననలతో పాడు
తీగలన్నీ సడలి
మూగ వోయిన దేమొ!

ఇప్పుడైనా తప్పు
ముప్పు తప్పింపగా
తపియించి తపియించి
దహియింతురా సామి

మెట్లన్ని కదలిపో
నెట్లు నవరింతురా
నెట్టుకొను పూనికే
నిట్టూరుపై పోవు

ఈడు వచ్చిన దాన
పాడ యత్నింపగా
నగుబాటుగొను శంక
దిగలాగు నొకవంక

నీపంపు సేయనని
కోపింప బోకురా!
భావి యేమో నాకు
నీవె దయసేయరా!

# నాగస్వరము

ఈ విషాదతమఃపట మావరించు
వేళ, మన్మనోవల్మీకబిలము వెడలు
పడగలను విప్పి విషభావపన్నగములు
మేనిమిసమిస కనుల మిర్మిట్లు గొలుపు

గళము పొంగిపోబట్టు నాగస్వరమున
ఊద నీనామ మహిరాజు లూగిపోయి
వికచచక్షుశ్శ్రవంబుల వినుచు వినుచు
పవనకుంభకయోగవిభ్రాంతి గొలుపు

ఏ ముహూర్తమునైన విరామమొసగ
కాలకూటోగ్రదంష్ట్రికాభీలఫణులు
కస్సుమని మ్రోగి కసిదీర కాటువేయు
ననెడి భీతి నిరంతర మడలిపోదు

ఎంతకాల మూపిరి బిగియించి యిటుల
నూదగల నోయి! ఓపిక నోప లేక
జారవిడుతునో చేతిలో బూర, ఈయ
దగదె యీశ్వరమూలమంత్రంబు లేవో

# ఆవేశవాహిని

ఏమి యావేశవాహిని! ఇటుల లాగు!
పార్శ్వవారిప్రవాహతీవ్రతకు నిసుక
తిన్నెపై నిల్చుతీరున తేలిపోవు
నా పదమ్ములు, నవశమై యాపరాక

ముక్కుపై వ్రేలువైచి యీమూర్ఖలోక
మబ్బురంపడి నిరసించు నా దినాల
పొదుపురేకలు వేబోక పొడము జాడ
లప్పుడే మన్మనోంబరమందు తోచు

ఈ ప్రవాహావేగము భరియింప లేక
స్థైర్యమే జారి చరణబంధము వడంగ
మునుకవేయుచు లోలోన మూల్గుకొనుచు
సుడుల నుక్కిరి బిక్కిరి పడుదు నేమొ

అలలహస్తాలపై లేచి, ఆడి పాడి
ఫేనదరహాసజ్యోత్స్నల పెల్లులోన
ఏ ననంతసాగరఘోష నెలుగుఁ గలిపి
తారకాదీప్తపథమంటి తాండవింతొ!

# మీమాంస

ఏ నహారహర్మ్యమ్ము నిర్మింతు నీ యనంత
సాగరతటార్ద్రసైకతస్థలము నందు
పిచుకగూండ్లెన్నో; నేనెంతో విజ్ఞుడ నని
మూర్ధ మంబర మంటగా మురిసి పడుదు

కడలి కదలగ తరగల కలతతోన
ఊడ్చుకొనిపోవు హర్మ్యంబు వోడ్చి యోడ్చి
పండ్లుపూండ్లను రచియించు నిన్ను కూడ
వమ్ముగా, నింక శూన్యతీరమ్మె మిగులు

నాశనములైన వెల్ల బునాది చేసి
తిరిగి తిరిగి వినిర్మింప దివుర బోన!
సంతతనితాంతగంభీరసాంద్రఘోషఁ
గంఠమును గల్పి కడలితో గడుప బోన?

# వ్యధ

ఎవ రెరుంగని విరితోట నెన్ని పూలో
కోసికొని వచ్చి, మాలలు గ్రుచ్చి, నీదు
కంఠమందున వైచు నుత్కంఠ తోడ
అడుగు తడబడ వేబోక వెడలినాను

వీరు వారును గీర్తింప వినుచు వలచి
నీ మహోజ్జ్వలప్రాసాద నికటమైన
ఎన్నడును గన్న జ్ఞాపకమేని లేని
నాదు ప్రణయప్రయాణంబు నాకెవింత

పేదబాలను; సిగ్గిలి వెనుక ముందు
చెదరి చూచుచు, మాసినచీరతోన
కదలివచ్చితి కలవారి కంటబడక
వలపుతీపులు మెలివెట్ట నిలువలేక

ఎంత నడిచిన గాని యనంతయాన
మేమొ! తరిగి పోవదు; దారి యిదియెకాదొ!
శుష్కసంకీర్తనభ్రమ చొక్కినానొ!
వెదకుచుంటినొ శూన్యంబు వీధివీధి

ఊర్పుగాడ్పులవేడిమి నుడికిపోవు
దామకుసుమదళంబులు తడుపు చుంటి
బడలిపోయిన నా ఫాలభాగ మురలి
వరద గట్టెడు ఘర్మాంబుఝురుల లోన

అడుగు నిడలేక, ఊపిరి విడువలేక
సూత్రములు త్రెంచి, మాల్యప్రసూనసురభి
దళములను ద్రుంచి చిమ్మిపోఁదలతు కాని
ఆపుకోలేని వ్యథ యేదో ఆశపెట్టు

## నిరీక్ష

ఎంత ప్రేమించి నాడవో! ఎరుగ కుండ
కానికలు తెచ్చి మందిరాంగణము నంత
నింపివైచితి; పేదొ వచింపలేని
వలపు నాకన్య హృదయంబు కలతపెట్ట

నీ స్వరూపంబు ప్రతిమల నించి నించి
పొంత విరితోటఁ గమ్మవిప్పూలు తెచ్చి
నిస్తులానందభరితనై నిశలు పవళ్ళు
లర్చనముచేసికొంటి పాదాబ్జములకు

ధూపదీపనైవేద్యముల్ తొలగిపోయి
ప్రతిమ లొరుగుచు వెలవెలబారు నిపుడు
పులకరించినయొడలితో, కలకదేరు
మనసుతో నీ పరిరంభ మనుభవింప

ఏనె నీవయి, నీవును నేన యగుచు
వ్యక్తి భేదమెలేని యద్వైతమధుర
తన్మయత్వానుభూతితో తాండవించు
మంగళముహూర్తమునకయి మరగిపోదు

# మహోదయము

ఎంతగా జీల్చి చూచిన సుంతయేని
దారితెన్నులు విడని సంతమసముడుపు
ప్రాతరుదయసమీపసంరంభ మనుచు
వాడవాడలఁ గుక్కుటధ్వనులు వింటి

పొడుపురేక లంరెడివేళ భువికి దివికి
ఐక్యము ఘటించి నిల్చె నీహారపటము
మరుగువడిపోయి సకలంబు మసకమసక
నీలినీడలు వోలె గాన్పించు నిప్పుడు

పదిపదంబులమేర విస్పష్ట పరిచి
నడచివచ్చిన కొలది వెన్కకు తొలంగు
పటనిరోధంబు; కడచినభాగ మెల్ల
మూసికొనివచ్చు వెనువెన్క ముసుగుదన్ని

అర్భకుడ నయ్య; విశ్వ మనంత మయ్య,
ఎటుల వీక్షింపగల నయ్య, ఇంత యింత
ఎంత నడచిన గాని లభింపబోదు
మామకాక్షియుగళికి సమగ్రదృష్టి

కరగి తుహినాంవరోధంబు గాలిఁ గలియ
ఉజ్జ్వలత్కాంతితో గూడ నొక్క మొగిన
విశ్వరూపసందర్శనవిభవ మొసగు
నీ మహోదయవేళకై నిలిచియుంటి

## కాంక్ష

మావిలేమ్రాను వోలె నా జీవితంబు
పూయ నామూలచూడంబు పొంగిపోతి
పండ్లకారుసంపదలకై ప్రాతిపదిక
మొదవెసని; లోన నుసిళ్ళు లూరిపోతి

కప్పుకొనిరాగ హేమంతకాలనిశల
తేనెపొగమంచు తెరలెన్నొ, తేరుకొనుచు
శైశిరానిలపరిరంభసౌఖ్యమునకు
పైరుకొంటి శిలాటుసంపద వహించి

ఉత్తరదిశాంతరమ్మున నురిమి చిరుత
మబ్బు తోచెనయేని తబ్బిబ్బుపడుచు
ప్రళయకాలవాత్యాహతి భాగ్య మెల్ల
దులిచికొనిపోవ మ్రోడయి నిలుతు ననుచు

నిండువై శాఖపూజల నీదు మ్రోల
పలుకబారినజాడలు పాదుకొనిన
కాపు నంత నివేదించుకాంక్ష తోడ
తడవుచుంటి నీ యభయహస్తమ్ము కొరకు

# సుధాకలన

అల్లకల్లోలమౌ మానసాబ్ధి నుండి
కాలధూమోగ్రపటలంబు క్రమ్మ దేవ!
హాలహాల ముద్భవించు నం చడలిపోతి
ప్రళయకాలమహోగ్రసంరంభ మనుచు

నవ్యజీవితానందసన్నాహమునకు
ఇంద్రపదవై భవములు జనించు సూచ
కములుగా గ్రహియింపక, కలతబరువు
నాపుకోలేక బిట్టు నల్లాడిపోతి

ప్రమదసంభృతవదన నా భాగ్యలక్ష్మి
కామధేనువుతో, కల్పకంబు తోడ
ఇందుబింబంబు తోడ, తా నేగుదెంచె
అమృతభాండంబు వెనువెంట నరుగుదేర

అబ్ధిఁబొడమిన వైభవ మంత కొలువ
ఆమె ధరియించి హృదయసింహాసనమున
పుండరీకాక్షుడను; సుధాపూర్ణకలశి
పంచుచున్నాను మోహినీపాత్ర దాల్చి

# సంధ్యాతాండవము

ఓహో మహాదేవ!
ఓహో మహేశ్వరా!
ఇది సాంధ్యతాండవం
బెసగు సంరంభమో!

నొసలి జేగురుకంటి
మసలి రేగినమంట
పశ్చిమాంగణ మంత
భగ్గుభగ్గునమండు

శిరసుమెట్టిన గంగ
చిందుత్రొక్కి కలంగ
వినువీధి చుక్కలై
మినుకుమినుకని మెరయు

వ్యోమమూర్ధము కదలి
సోమభూషణమదరి
ఎగువంకగా దిరిగి
దిగువ దిగువకు జారు

తొడవుపాపలు సాక్షి
పడగపడకు గ్రక్కి
విషమషీకాళిమము
దెసలదెసలకు పులుము

పునుక పేరులు జారి
మినుకుతారల జేరి
వెడదగోళమ్ములై
ఘుడుకుదుడుకున దిరుగు

నిజదేహాభసితమ్ము
గజచర్మవసనమ్ము
వెలుగుచీకటి సందె
మలగి నింగికి నిండు

ఒకవంక తాండవ
మ్మొకవంక లాస్యమ్ము
అర్ధనారీశ్వరము
అఖిలబ్రహ్మాండమ్ము

అడుగడుగు కదలింప

అణువణువు పులకింపు

నీయూర్పు కదలాడి

నిఖిలలోకము లూగు

# సౌందర్యలక్ష్మి

రసికత నెరుంగలేని లేబ్రాయమందు
చెక్కిలిని గీటి చిరునవ్వు సిగ్గువార
మృదులసుమదళంబుల బోలు పెదవులంటి
ముద్దుగొనినావు చూడ్కులు మోహరించి

హేమకంకణకింకిణు లేమొ పలుక
ధ్వని ప్రధానమ్ముగా, బాహువల్లరులను
నా భుజమ్ముల బెనవైచినావు, కాని
వెలవెలంబోయి నేనట్లు నిలిచినాను

పరిసరమ్ములనిశ్శబ్దపరత తెలియ
ఉ[illegible]వాభోగ మెగసిపో నూర్చి నీవు
కదలిపోవగ రూక్షవీక్షణము బరపి
చరణమంజీరనినదంబు పరిహసించె

స్మృతిపథాంకితములు నీ విచేష్టితముల
మధురమథనంబు నేడు నెమ్మదిని రేగు
ఉజ్జ్వలమ్మయిపోవు నేనూర్పు కొలది
నిర్మలంబౌను కన్నీరు నించుకొలది

అందుకోలేని యమృతసౌఖ్యానుభూతి
కఱ్ఱు సాచుచు తిరుగాడ వెఱ్ఱి వోలె
ఎడద పిండెడి మాధురి యెలుగు దాల్చి
వనులు పులకింప; సెలయేరు ధ్వనులు నింప

# మాలతి

లక్ష్మీ! మన మాలతీ
లతవైపు చూశావ!
మనమంటె ప్రాణమే—
మనుగడే మనకేమొ!

ఆ చిన్నిహృదయాల
అనురాగరసముతో
అరుణమై రేకెత్తి
అల్లాడిపోయింది
* * * * *

చల్లన్ని ఆ రేయి
జంటగా మన ముంటె
చిన్నిప్రసవాక్షతలు
శీర్షాల నుంచింది
* * * * *

అదిగో మన బొజ్జయ్య
లట చిందుతొక్కగా
నిలువెల్ల తెలినవ్వు
ఒలికిపో చూస్తుంది

* * * * *

లక్ష్మి! మన మాలతీ
లతవైపు చూశావ
మనమంటె ప్రాణమే
మనుగడే మనకేమొ.

## అంకితము

లాస్య మొనరించు కన్నెగులాబిపూవు
సగము వీడిన పెదవుల సంచలించు
తరుణదరహాసరుచిరజ్యోత్స్నలహరించె
నాదు హృదయమ్ము — వెఱ్ఱినై నాను నేను

అది విహారవనాంత; మభ్యంతరములు
వ్రాసినారలు శాస్త్రులవార లటకు
నైతికులు పోవరాదని; నాల్గుదెసల
కంచెలు బిగించి రక్షణ ముంచినారు

నియమములు దాటలేని దుర్భయము తోన
వనికి వెలుపల తచ్చాడు ననద జూచి
వేగిపోయినయెడద నవ్వారి వెలార్చు
సురభినిశ్వాసములవేడి సోలిపోతి

ఏదో దుర్విధి తానయి యేర్చి కూర్చి
తేటతేసియయెద విషకీటకమ్ము;
రేకు రేకును గొరికి హరించినైచె
ప్రతిక్షతము నాటి నాగుండె రక్తమురుల

పవలు రేలూర్చు నిశ్వాసపవనములకు
వనము నుడికించి పలుమారు ప్రహారిదిరిగి
ద్వాఃకవాటశిలాస్థలి తలను జేర్చి
వెడలబోసితి దుఃఖంపుజడుల నెన్నొ

విచ్యుతలతాంతమైన తద్వృంతము గొని
కాడువారినహృదయరక్తమున ముంచి
వ్రాసికొని నేను కరుణాప్రబంధ మొకటి
అంకితముచేసి కవినైతి ఆమె స్మృతికి

# వలపు తీరు

మొయిలుపడుచులు పచరించు హొయలు
నెమ్మి పురివిప్పి విశృంఖలమ్ము సలుపు; [చూచి
మెరపుకన్నెలు నటియించు తెరవు గాంచి
పాటలంబాడి సెలయేరు పరువులెత్తు;
చూతపల్లవరక్తిమం జొక్కిపోయి
గొంతు విడి పాడు మత్తపుంస్కోకిలమ్ము;
పూవుపడతుక చెక్కిలిపొంకము కని
మరుల వేగుచు గీరించు మధులిహంబు,
ఎచట జూచిన ప్రకృతిలో నింతస్వేచ్ఛ!
ఒక్క మర్త్యుడే యెదలోన నొరయు వలపు
తెలుపుకోలేక కృశియించి దిగులునొందు
స్వార్థపరలోకవిరచితవక్రగతుల
వ్యభిచరించెడివారల భయము? లేక
ధాత యవివేకమేధఃప్రదానఫలము!

## చటకమిధునము

మాలతీలతామంటపమధ్య మందు
సంజబంగారుజిలుగుపసందు లడరు;
పూలగుత్తులతీవటుయ్యాల నెక్కి
చటకమిధునంబు ప్రేయసీ! సందడించు

ఎంతబయ్యార మొల్కగా ఈ సమీరు
డూచుచున్నాడు! చిరురెక్క లొరసికొనుచు
నిండుమనముల సొద లేవొ నింపి నింపి
ఓడికలుగట్టు నాతని యూర్పుదారి

పండెనో బహుజన్మదాంపత్యఫలము!
క్షణికవిరహమ్మునకునేని జాలలేక
పలుకులో పలుకు గలిపి ప్రీతిముహూర్త
మొక్కటేహాయి జంటగా నూగుచుండు

బలవదాచారశృంఖలాబద్ధుల మయి
కటకటాల గృశింప, లోకమ్ము మనల
పరిహసించును ప్రేమతో బ్రదుక నీక;
నీరసిల్లెడిమెడద లెడారు లయ్యె

* * *

మందమలయసమీరునిమచ్చికలకు
పులకరింతలు దాల్చి కౌగిలిని జొక్క
సైకతనితంబ, గౌతమీసరసహృదయ,
పిన్ననగవుల సిగ్గులు వెడలబుచ్చి

మర్మమెరుగు జాణ మలిసంజ చెంగావి
చీరచెంగు చేత జిక్కబట్టి
పశ్చిమాశ కవలి భవనాంతరమునకు
పెదవి విరిచి నవ్వి వెడలిపోవు

## జత

నిలువునిలువెల్ల తెలినవ్వు లొలికిపోవ,
పైరగాలికి మధుమాసపరిమళమ్ము
లూర, నొక్కటే రెమ్మ నుయ్యాల లూగు
మల్లెపూవులజత వోలె మనము సకియ!

దైవదత్తము, ప్రేమబంధమున నిలిచి
ఒకరి యెదలోన నొక్కర మొరసికొనుచు
జీవితము లొక్కహాసమై చెలువు నింప
పరిమళింపమె మధురస్వప్నముల దారి

# ప్రణయ కోపము

నేను:

చెలియరో! నీదు నెమ్మనము
చిన్నగ జేసికొనంగ నేల?
నీవలపుబరీక్షకై యిటుల
బల్కితి నంతియకాని నిన్ను
నాతలపుల రాణిగా,
మధురతామహిమల్ గురియించు దేవి
వెలయగ నా యెడందనిలబెట్టితి [గా
నమ్ముము బాస చేసెదన్

ఆమె:

చాలును జాలు లెండు సరసంబులు;
నామన సెంతో నొచ్చె;
వాచాలత గల్గు వారయిన
సారవచోమృతమాధురీఝరీ లీలల
లాలనల్ సలిపి, లేతయెడంద కరంగి,
పొంగులన్ దేలగ
కౌగిలింతల నుతింతురు గా
కిటుసేతురే ననున్

నేను:

వలపు తెరంగు నీ కెరుగ వచ్చునె
ముగ్ధవు కాన? హాస్యపుంబలుకుల
నొల్కు నల్కలయుపాయనముంగొని
ప్రేమయాత్ర ఇంపులు దళకొత్తు,
జీవిత మపూర్వమధూదయభాగ్యసం
జెలువువహించు నో చెలియ! ప్రదన్
చేతమునన్ గలగంగ బోకుమీ

ఆమె:

కదపిన తీయతేనియలు గార్చెడి
లేజవరాలినెమ్మనం బదను నెరింగి గై
హాయి నొసంగి మెసంగుగాని క్రొనిన
మీ రదలిచి లాగ నిట్టులటు
లామధు వంతయు నొల్క
దెట్టియాబ్రిదుకు రుచించునే?
యపుడు పాలన లాలన లింపునింపునే?

నేను:

ఏది మరొక్కమారు వచియింపుము,
ఓజవరాల! ప్రేమలో నీదిన నీదు పల్కు
వెలయించెడు దీయనితేనెసోన,
ఆస్వాదమొనర్పనిమ్ము
మనసార తదీయరసోత్కరమ్ము—
ఓసీ! దరహాస మల్లదిగో
సిగ్గిలు నీ మధురాధరంబునన్

# పాపాయి

పవ్వళించిన దోయి
పాపాయి తొట్టిలో
పాలబుగ్గలు కాంతి
పూలు పూచినవోయి

యోగనిద్రో యేమొ
సోగచిరు రెప్పలో
నీలాలజోడుగా
నింగి దాగినదోయి

చివురాకు పెదవిపై
తలచూపు నవ్వులో
పొడుచు పూర్ణిమలోన
విడుచు వెన్నెల లోయి

అవగాహ, నాశ్చర్య,
మానంద మింకేమొ!
కనుబొమ్మవంపులే
చిరుగొమ్మ వగలోయి

నిదురబోయినపాప
వదనమండలములో
ఎందుకో జనియించు
ఈ భావచిత్రాలు

కనునేమొ స్వప్నాలు
వెనుకజన్మల గాథ
వినునేమొ భావిజీ
వితశీలనవబోధ

భూలోకదీపమై
పొందు మా పాపాయి
స్వర్లోకభామినులు
సాగనంపుదు రేమొ

దిగివచ్చు తిరునాళ్ళ
దివ్యతేజం బింక
నవ్యమై వెంటరా
భవ్యమై తోచునో

అంగ్లకవిశేఖరుం
డన్నాడు మును నాక
మడుగడుగు బాల్యమ్ము
ననుసరించు నటంచు

బాల్యమే దివ్యమో
ప్రాయమే సవ్యమో
బ్రతుకులోతుల నీద
మదికి లేనేలేద

## తెలుగుతోట

ఎంత చక్కనిదోయి! ఈ తెలుగుతోట
ఎంత పరిమళమోయి! ఈ తోటపూలు

ఏ నందనము నుండి
ఈ నారు తెచ్చిరో!
ఏ స్వర్ణదీజలము
లీ మడుల కెత్తిరో!

ఇంత వింతలజాతు లీ తోటలో పెరుగు
ఈ తోటయేపులో ఇంత నవకము విరియు

ఏ యమృతహస్తాల
ఏ సురలు సాకిరో
ఏ యచ్చరల మురువు
ఈ తీరు దిద్దెనో!

ఈ పూలపాలలో ఇంత తీయందనము
ఈ లతలపోకిళ్ల కింత ఒయ్యారమ్ము

ఏ మహాత్త్వ రశ్ము
లీ తోటలో గలవో
ఏ దివ్య తేజస్సు
కీ పూలలో నెలవో

ఈ తోటపై గాలి ఇంత మెయి సోకనా!
ఈ నీరసిలుబ్రదుకె ఇంత చివురింపనా!

జవరాలివలపు వలె
రవిబింబదీప్తి వలె
హిమశిఖరిఠీవి వలె
ఋషివాక్ప్రతిభ వలె

నా యెడందను గలచు నా తెలుగుతోటలో
పాదుకొననిండోయి! పలవింప నిండోయి!!

# పునర్దర్శనము

తల్లి గోదావరీపునర్దర్శనమున
హర్షపులకితగాత్రుడ నగుచు, కనుల
మోదబాష్పమ్ము లురులగా మ్రోల కరుగ
పరుగువారితి నవ్వ దిగ్వనిత లెల్ల

పట్టగా రాని రభససంభరితహృదయు
మును చలింపగ, పులినాంకమున శిరమ్ము
జేర్చి, కన్నీరు మలకలై పేర్చు నటుల
ఏడ్చితిని వెక్కి-వెక్కి-నేనింత సేపు

అంబ గౌతమి, పెద్దముత్తైదువ, నను
మృదులశీతలకరమంటి పదిలపరిచి
పలుకరించును మధురసంభాషణముల
చిలుకరించును ప్రేమసంస్నిగ్ధసుధల

ఎవతె యొడిలోన నాబాల్య మేను గ్రోలి
జీవధారలు స్వాతంత్ర్యజీవగీతు
లాలపించితి దశదిశోద్వేలముగ, వి
యోగవహ్నుల నామెకై వేగిపోతి

ఎప్పుడు విన్నసరే ద్రవియించిపోదు
ఆమె సితపదాంభోజచిహ్నాల పునీత
మైన యుగయుగాలచరిత్ర, అంత నెగసి
సంచరించెదు భావపక్షాలు విప్పి

ఎచట నున్న సరే నటియించిపోదు
స్వేచ్ఛాజీవనపరిపూర్ణ, శాంతహృదయ
ఆమె మాయమ్మ, పావని, అనుచు జాటి
ముక్తకంఠమ్ములతో దిశల్ మ్రోగిపోవ

# సఖ్యము

అవును, సఖ్యము; నా విహంగమునకు
పుణ్యగోదావరీతీర భూము లందు
జన్మ జన్మాల బాంధవ్యము స్మరించి
ఓడగట్టుదు మీతీర మొరసిపోవ

ఆ మహీజవిశాలశాఖాగ్రమందు
తా నదించెడి గీతివితానమునకు
లేతనీరెండబంగారుపూత కరగి
గౌతమీవారిగర్భాన గలసిపోవు

పాదపసమీపకలమకంబళము పైని
నే రచించెడి గీతికానిచయ మెల్ల
శాంతగౌతమి వినిపించు సాంధ్య లందు
ప్రకృతికాంతకు పులకాంకురములు తోప

ఇర్వురము గూడ కవులమే, ఎగసిపోదు
మంబరతలాన స్వేచ్ఛగా నాడిపాడి
జిలుగురెక్కలవన్నెలు చెదర తాను
భావపక్షోజ్జ్వలత్కాంతి పర్వ నేను

ఏదో యవ్యక్తరవ మను నీ దరిద్ర
మనుజలోకమ్ము; మా భావమధురిమములు
రసహృదంతరమైన ఈ ప్రకృతి కెరుక
తరళజీవనమైన ఈ తటిని కెరుక

# మాలపిల్ల

పండువెన్నెల పుక్కిటబట్టి నవ్వి,
పరుగులెత్తెడి సెలయేటిపంచ ఁబోవు
ఓమధురగాత్రి! నీ కంఠ మురళి పొరలు
ఏలపాటకు దివి ద్రవియించి పోవు

పుణ్యఫలముల ప్రోవుగా పుట్టినావొ!
విడిచి గంధర్వలోకంబు పుడమి బడితొ!
మూడు లోకము లొక్కటే ముడి రచించు
ఎలుగుతీపులు లభియించె నేటిలోనీకు

మావికొమ్మల సయ్యాట మరులుగొనిన
పవకుమారుని కౌగిటి పారవశ్య
భాగ్యమున సోలి స్వర్గసోపాన మంటు
నీ గళమ్మున సాగు సంగీతరేఖ

మానముద్రాంకితమ్మయి వీచు లొగ్గి
ఈ విభావరి విని చలియించిపోవు
కరగు దేనును నా కన్నుగవను దేరు
బాష్పపటముల జంద్రిక ప్రతిఫలింప

పొంగిపోవగ నానందపూర మెడద
రాగమొలికించుప్రకృతిసామ్రాజ్యరాజ్ఞి
మాలపిల్లని తొలగ బ్రాహ్మణులు నీకు
పూలపిల్లని యెద నొల్కఁబోయు దేను

# కోకిల

వానకారు కారుమొయి లంబరము పైని
మూగికొనిరాఁగ నేనును మూకవోతి
మాయమైపోయెబో సుధామధురగీతి
ఒక్క సిస్వన మేని పై కురలి రాదు

పాడినాను వసంతప్రభాతపవన
పులకితోద్యానసీమల, పూవుపడతు
లెంతగా రాగసక్తలై, ఎంత మురిసి
విరిసినారలు నా మధుస్వరము నందు

తేనెవాకల దాఁగి, మత్తిలి, సమీరు
డెంత సమ్మోదవివశుడై, ఎగుభుజముల
దాల్చి నా గానరేఖలు తాండవించె
పరిమళంబుల నాయాసభరము నార్చి

చెవులు సోకగ నా కుహూరవము కవులు
కరగిపోయినమొదలుతో కావ్యజగతి
నాకు కలకంఠ మను పేరు, నా స్వరంబు
పంచమంబను కీర్తి రచించినారు

పొడుచుకొనివచ్చు తలపులు వెడలబోయ
ఎంతగా చించుకొన్నను గొంతు విడని
బాధ కోర్వలే కోడ్చుడి బాష్పములకు
గురుతు లేదీ నభోమాసకుంభవృష్టి

## రాజుకొలువు

రాజుకొలువున మెరయు రత్నకాఠిన్యమ్ము
మానమే కొనగలదు
ప్రాణమే తినగలదు
మరులుపోయెద వేల నోయి!
మరగి చూచెద వేల నోయి!

సిరిబొమ్మ సంబ్రాల జిలుగువలువలతళుకు
బలివితర్దికె చూపు
విలయకాలమె రేపు
బ్రదుకుకండలు చిదుప కోయి!
హృదయభాండము చదుప కోయి!

ప్రాసంగు వరిచేల పసరుమైకపుతావి
పాటతేటలు తేర్చు
పూటపాటులు తీర్చు
జీవనము నడుప రావోయి!
జీవితము గడుప బోవోయి!

పుణ్యగోదావరీ పులినసింహాసనము

స్వాతంత్ర్య తాండవము

స్వర్లోకవైభవము

అధివసింపగ వలతి వోయి!

అమృతభుక్కులు కొలుతు రోయి!

# మేలుకొలుపు

మేలుకొనరా భరతవీరుడ
మేలుకొనరా వినుతధీరుడ
మేలుకొనరా!

కారుమబ్బులు తొలగుచున్నవి
కటికచీకటి విరుగుచున్నది
కనకకాంతుల వైభవముతో
కలుగునోయి ప్రభాతభాగ్యము

వెలుగుతొడిగిన వెన్నముద్దయి
వేగుచుక్కదె వెడలుచున్నది
భావిభాగ్యశుభోదయమునకు
బావుటా నడిపించుచున్నది

కూర్కులో చైతన్యకలనకు
కుక్కుటంబులు కంఠమెత్తగ
జడలు విడివడ నడలు దొరికిన
గడుసుదయ్యా లడలుచున్నవి

నవోషస్సు దళాలు విప్పగ
నందనమ్మగు భారతావని
తూర్పువాకిటి త్రోవ నదిగో
తోచు బంగరు వేవెలుంగులు

పద్మినీకలకలముకనరా
భ్రమరనినదము దిశల వినరా
ద్విజముఖస్రుతసామగాన ప
విత్రశస్తులు రేగ గదరా!

# మహాత్ముడు

రక్తసిక్తప్రపంచసామ్రాజ్యవీధి
శాంతికలశమ్ముతో నహింసాపయస్సు
అడుగడుగు పంచుకొనుచు మహాత్ముడొకడు
ప్రాగ్దిశాంగణభూముల బయలుదేరె

బ్రహ్మతేజోవిభాస్వరఫాల మందు
ప్రతిఫలించు నిర్మలాంబరప్రశాంతి
తరళదరహాసచంద్రికాధవళకాంతి
కంతరంగాన ప్రేమదుగ్ధాబ్ధి పొంగు

అతడు మెట్టినమేర పుణ్యాశ్రమంబు
అతని వాక్కులు వేదభాష్యాంతరములు
అతని మౌనము లోకభయంకరమ్ము
అతడు పూనినదీక్ష బ్రహ్మాండరక్ష

భారతీదేవి స్వాతంత్ర్యభవన మందు
సత్యదేవత తనకు సాక్షాత్కరింప
పసుపు కుంకుమ లద్దిన వడుకునూలు
పాణిబంధము ధరియించె పరమమౌని

అంత తొలుకారుమెరపులే యంతరిక్ష
మంత మంగళతోరణ మందగించె
అణువణువు గూడ పులకించి అవనియెల్ల
మురిపెములు గుల్క శాద్వలాంబరము దాల్చె

ఆలమందల లేగలు పాలనురువు
సెలవులం జార, క్రొక్కాడు చిందుతోడ
వడిగ దిరిగెడు రాటాల విడును పాట
పల్లెపడుచుల సిగపూలఁ బసుపుతేట

జీర్ణపర్ణకుటీర సంకీర్ణదేశ
చిరనివాసిని, దారిద్ర్యశిథిలవాణి
గగనవాణిగ మార్మ్రోగె కడల కడల
అతని సందర్శనోత్సాహ మావహించి

పేదగుండెల నెత్తురు పీల్చి పీల్చి
మారణాగ్నుల నుమియు నున్మత్తభయద
యంత్రభూతము లాక్రందనార్తి కదలె
అతనియడుగులసవ్వడి కదలిపోయి

సాట్టహాసకోలాహలస్వనములు నిండు
మృత్యుకింకరభీభత్సమేళనములై
నవ్యజీవితనాట్య విన్యాసరంగ
మంగళోత్సవవైభవమంటపములు

ఎరుకగల పురంధ్రులు హారతెత్తి నిలిచి
జీవకళికాసహస్రంబు, చిందుహృదయ
పుటకవోష్ణశోణితలాక్ష పూసినార
లతని యుపదేశలక్ష్మీపదాబ్జ యుగళి

# నిట్టూర్పు

సాంఘికాచారకారావిషప్రదేశ
వాస మందున జివికెడుబాల బాష్ప
పటనిరోధము చీల్చు దృక్పథము నుండి
ఎడద నేర్చెడు బడబాగ్ని పొడవుచూపు

ఆమె కూరట కల్పించు నాశలెల్ల
ఉక్కుచెరసాలనె కృశించి యుడిగిపోవ
మంత్రితభుజంగ ముట్టుల మసలలేక
బుసలుకొట్టుచు లోన వాపోవు నిపుడు

ఆమెయూర్చెనా పెనుగాలు లడలిపోవు
ఆమె యేడ్చెనా సంద్రాలహద్దు పోవు
ఆమెలో నగ్నిపర్వత మణుగు; పగుల
నేవి నశించునో నిప్పువెల్లువల లోన

# క్షోభ

ఎవరు వింటా
రెవరు కంటారు

ఈ నిగూఢక్షుభితహృదయుల
ప్రాణతర్పణశోకగాథలు

ఎవరు వింటా
రెవరు కంటారు?

ప్రభువిలాసోత్సవపు హేలా
పానపాత్రల పొరలిపోయెడి
మదిరలోపల హృదయ మొదుచుక
రుధిర మంతయు మరుగుచున్నది

ఎవరు వింటా
రెవరు కంటారు?...

ధననిరంకుశదావపావక
తామ్రవర్ణోజ్జ్వలితకీలల
తాండవములో నుడుకుచున్నది
తనువు నంటినపిశితలేశము

ఎవరు వింటా
రెవరు కంటారు?...

యంత్రనిర్మితశకటనేముల
అనుపమానాక్రందనములో
అవసి నురుగైపోవు చుండిన
అస్థిపంజర మరచుచున్నది

ఎవరు వింటా
రెవర కంటారు?...

ఘోరదారిద్ర్యాసిధారా
క్రూరనాట్యవిజృంభణోద్ధతి
కలగుమంట కపాల మంటగ
గర్భగోళము కనలుచున్నది

ఎవరు వింటా
రెవరు కంటారు?...

ఘూర్ణితార్ణవఘోషలో వలె
దీర్ణహృదయక్షోభ వెలువడి
హాలహలమే యుద్భవించునొ!
అమృతభాండమె యవతరించునొ

ఎవరు వింటా
రెవరు కంటారు?...

## కడలిరాజ!

గర్భమున నేదో బడబాగ్ని కలదటంచు
సవిధపాషాణహృదయముల్ జాలిఁ గరఁగ
ఒక్కటేరీతి నకట రేయుంబవళ్లు
కోటిగొంతుక లెత్తి ఆక్రోశ మేల?
సకలరాజాధిరాజమస్తకకిరీట
భూషణోచితములు రత్నపుంజములకు
ఎడద ఆకరమయ్యె ఓ కడలిరాజ!

# స్వప్నము

సప్తసీమల నా భుజాస్కంధమూది
స్వర్గమయమైన వాసంతవల్లివోలె
నవవిలాసంబు తొలుకాడ నాదు వెంట
సంచరించెద వెవతెవో చాననీవు

చంద్రికాధౌతధవళ వస్త్రాంచలములు
పాలకడలి తరంగాల చాలువోలె
వెన్నుదన్నిరా, వదనారవింద మంగ
ళప్రసన్నవౌ నాభాగ్య లక్ష్మివేమొ!

అలికకుంకుమతిలక బాలార్కరుచికి
అభినవోన్మిషితము, జీవితాబ్జమలరు,
అమృతబింబితాధర దరహాసరేఖ
చిందువెన్నెలకెగయు నానందజలధి.

నయనపద్మాలు సద్మాలు నవ్యకాంతి
కళికలకు; స్వప్నపథమంత వెలుగుజిమ్ము;
వాక్కు లందుకోలేని దివ్యప్రభావ
మేదో ప్రవహించు నీవు స్పృశించునంత.

ఉ. రా

స్వప్నపథమాత్రదర్శన భాగ్యమరుగ
జాగరణవేళ మెలివెట్ట మూఁగయెడద
వ్యథల నలిగినకొలఁదిని మధురసంబె
ఇక్షుదండమువోలె స్రవించునెపుడు.

## దుఃఖధోరణి

ఇడుములు కల్గనేమొ జనియించిన వేదన
రోదనధ్వనిన్ బుడమికి ధారగా
కడవపోతలు పోసిన కంటినీరు నిల్కడగన
శూన్య మేదో తడికన్నుల గాంచెడి దీనమై
కనంబడు గగనేందిరారమణి
వర్ష నిపాతసమాప్తి వేళలన్

నిండుగ దుఃఖపూరమున నిండినగౌతమి
ఆస్య మెత్తినె ఒండు వచింపబోక ఏదియో
మొదలో గలపంగ పై కిరాకుండనడంచి వైచును
వయోజనితేద్ధవివేకసంపదల్ పండినవృద్ధగావున
నభంబుకలంగునటన్న భీతినో

నాకముజూచి, పత్రినయనంబుల
గార్చుచునశ్రుబిందువుల్
మ్రాకులునిల్చిపోయినవి, మాటలకందని
సౌహృదంబునన్ వాకిటిబంధుకోటివలె;
వాకొనలేనిజడంబులై గిరుల్ మూకొనుజాలిగా
హృదయముల్ ద్రవియింపగ మెల్ల మెల్లగన్

నాయెదపొంగిపోయె
జననమ్ములబాంధవమేదో యొక్కటైపోయి
విషాదవాహినులు;
పోల్చుకొనంగవశంబుగాకదుఃఖాయతమూర్తినై
ప్రకృతియంతయుగప్పినశోకవార్ధిలో
పోయితి లోకలోకముల
పొంతల దేలుచు వెఱ్ఱినేడ్చుచున్

## ఆత్మ తేజము

క్రుంకనున్నది ముదిప్రొద్దు; కువలయమున
ఇంత శోకము ప్రబలగా నేల యిపుడు?
గగనభామిని దుఃఖాగ్నిఁ గ్రాగిపోయి
వదనబింబము బిట్టెఱ్ఱువార వగచు;
పశ్చిమాంభోధి వక్షమ్ము బాదుకొనెడు
రోదసీగహ్వరము నిండ రోదనమ్ము;
అండజమ్ములు రెక్క లల్లార్చుకొనుచు
గుములుగుములుగ కూడు నాక్రోశనమున
కళలు జారగ దెసలు చీకటిముసుంగు
లాగికొని ఖిన్నలై పోవు * * *
అతడు దివ్యుడు; రోచిస్సహస్రమూర్తి
జననవేళనె వేదసంచారపరుల
భూసురుల యర్ఘ్యములుగొన్న పుణ్యధనుడు
సప్తసైంధవబంధురస్యందనమున
వేవెలుంగుల లోకాలు వెలుగమనిచి
నిండువృద్ధుగ వెడలంగ నుండె; కాని

ఆత్మతేజము తోరగలే దతడు రేపె
ప్రాకృతీమణిపుణ్యాగర్భమ్ము నందు
నిత్యనూతనవై భవోన్నద్రికాంతి
పుంజముల జిమ్ము పాపడై పుట్టు మరల

# సంశయము

వేయివెలుగుల దివ్వెగా వెలుగు రవిని
గొలిచి భ్రమియించు వివిధమండలము లందు
బహుళయోజనపరివ్యాప్తవసుధ మీద
నెక్కడో చుక్కనై చరియించు చుందు

కాని, భౌతికసయనలక్ష్యమున దొరకు
మండలమ్ములె కాదు బ్రహ్మాండములని
కల్పనముచేసి భావనన్, గక్ష్యల నిడి,
యేను త్రిప్పుచు చుట్టు యథేచ్ఛతోడ

ఊహ కందని యొక్క మహోత్సవముగ
సాగిపోయెడి పుడమి నూరేగి పిదప
బ్రతుకు సడలి యొడలు మంటిపాలు కాగ
ముగియునా సర్వ? మేదైన మిగిలిపోన?

## మేఘమా!

తొలుకారు మేఘమా!
వలపూరి మురిశావు
మించు బంగరు తళుకు
నించు చంచలఁ గాంచి

త్రుటిలోన మైమరసి
మటుమాయమై పోయె
కనువెల్గు జగమంత
కటిక చీకటి మయమె

ఎందుకే మ్రోసేవు
ఎడద బ్రద్దలుకాగ;
ఏందుకే యేడ్చేవు
ఏళ్లు ఊళ్లను ముంచ

ఎరుగుదే జలదమా!
తొరగు కన్నీరంత
ఎన్ని జీవుల బ్రదుకొ
ఏ పయోనిధి కొరకొ!

నీ బ్రదుకు మాత్రమ్మ
నిలకడా? — పలుకడా
పొగ, వెల్గు, నీరు గా
లిగ మున్ను కవిరాజు?

వాపోవ నీకేల
నీ పోవు నీ దారి?
బ్రదుకులే చిత్రాలు
భ్రమసిపోకే తల్లి

# అశ్రుతర్పణము

అమృతపదవాసి
నాపుత్రిరత్నము
పార్థసారథికి:

“దండ మిడియెదు నాన్నకు; దైవమునకు;”
అనిన కడపటిపలుకులే అతని బ్రదుకు
కడు ఫలశ్రుతి: రేబవళ్ల డలి విడుత్తు,
తప్తహృదయుడ, దుఃఖాశ్రుతర్పణమ్ము

ప్రకృతి బహిరంతరములు తుపానుః రేగి
నా కుటీరాంతరజ్యోతి నలిగి నలిగి
పడతియును నేను బ్రదుకులు పారదేరచి
ఎంతగా దాచుకొన్న కొండెక్కి పోయె

కరుణ రవ్వంత యున్న నాకమె కరంగ
హృదయమును జీల్చుకొనివచ్చు వెలుగుతోడ
పదివసంతాల స్వప్నకావ్యము ముగించి
అశ్రువులతోడ స్వస్తివాక్యమ్ము నిడితి

మధురజ్యోత్స్నప్రసాదసంపత్కరములు
కలలు రేపిన చంద్రమఃకాంతు లంత
విహ్వలములయి కన్నీరు విడువ దొడగె
భావసంశూన్యమైన ప్రపంచ మందు

౨

ప్రాగ్గిరికూటపు
ప్రభాతకాంతుల
పార్థుడు పట్టే కాహాళు లవిగో!
వినబడలేదా! వినబడలేదా!

కన్నులు తెరచే
కమలముఖమ్మున
పార్థుని పెదవుల చిరునగ వదిగో
కనబడలేదా! కనబడలేదా!

పూలకన్నియల
బుగ్గలు నొక్కుచు
ఈలలు వైచే
బాలానిలుడై
పార్థుడు పాడే గేయా లవిగో!
తెలియుటలేదా! తెలియుటలేదా!

ప్రభాతవాయు

ప్రసరణమ్ములో

పయోదమాలా

ప్రస్తారములో

స్వర్గవాహినీ

సైకతములలో

పార్థక్రీడలు! పార్థక్రీడలు!!

కుమిలి రగులుచు చిరుమంటకొసలు విసరు
అగ్నికుండాభమైన హృదయాంతరమ్ము
జీవితాశయకిసలయశ్రీలు మాడి
మ్రోడువారెడి బ్రదుకింక మోయలేను

ప్రాణిలోకరహస్యాలు పట్టువడక
నీరసిల్లెడిమేధస్సు నిలువ లేక
పడుగుపేకలుగా కూర్చి వర్ణవితతి
భ్రమపటంబేదో రచియించి శాంతిపొందు

ఇంత యజ్ఞానతిమిరసంక్రాంతమైన
జీవితమునందు కల్పనచేసికొందు
ప్రొద్దు పోకకు కపటసంపుటము లెన్నొ
నవ్వుకొందునా? ఏడ్తునా? నన్ను జూచి

౪

బుగ్గల చొట్టలు
నిగ్గులు తేరగ
కలలో పార్థుడు
కలకల నవ్వెను

బొండుమల్లెజడి కురిసినది
పండుపున్నమయె విరిసినది
పాలకడలియెద పొంగినది
ముత్యాలు రాసులై మొలిచినవి.

నిలిపి కవుంగిట
నీరయిపోయితి
కన్నులు విడివడె
కారురేయి కొస!
సుప్త ముద్రితము
శూన్యప్రపంచము

నా కపోలముల
నయాగరాలై
పారు బాష్పముల
పాన్పు తడిసినది

ఎదుటి గోడపై
ఏమి యెరుగనటు
కదలిపోవు
ఈఘటీయంత్రమే.

బ్రదుకునాల్నాళ్లు పాయసపాత్రజేసి
నోటి కందించి, నునుపచ్చితేటతేనె
చాలు లూరెడి బాసల పూలదోనె
పైని ఉయ్యాల లూపితి పార్థ నన్ను

నా మనస్సింత క్లేశాన నవయకుండ
నీ యెడందఁ దేవెన నవనీత మంత
పూతవెట్టితి; సుగుణకర్పూర దీప
హారతెత్తితి నాఁడు సింహాసనమున

ఎంత పాషాణహృదయమో! ఏనె నిన్ను
కూలికాసులజీవిక కూర్చుకొనిన
కటికబాపలతో వల్లకాటి కంపి
ఏడ్చుగోదావరీతటిఁ బూడ్చినాను

స్మృతిపథాకాశసింధువై చిమ్మిరేగు
అశ్రువారిప్రవాహమ్ము నడ్డుకొనకు
మెట్టవేందాతమృత్తిక కట్టవైచి
సిగ్గుమాలినబ్రదుకు నర్పించుకొరకు

నా గృహారామసీమ జన్మంబు గన్న
తొలివసంతప్రవాళసంతోషమునకు
పురిటిబాలెంతపసుపులు విరిసిపోయె
పుట్టువండువువేడుక లుట్టిపడియె

పదివసంతాలమొగ్గయై పరిమళింప
"పారిజాతప్రసూనసంపదజనించె,
నందనవనమ్ము; అతడుపురందరు" డని
తోటనడుగిడువారెల్లతోచియనిరి

కడుపులో తేనెసోనలకడవ లెన్నొ
కూడబెట్టుచునున్నది కుసుమదశల
హృదయమకరంద మాను షట్పదకులమ్ము
లెంతకీర్తించునో యని మెగసినాము

కాని కనరానిదుర్విధి గర్భమంత
ఏదో విషకీటకమ్మయి యేర్చి దొలువ
ఒక్క వేబోక రాలిపో నుడికిపోదు
కడుపు చుమ్మలుచుట్టు దుఃఖాన క్రాగి

రాలుపడియెడు వెలుగుతో, చాలు కట్టి
యురలు కన్నీటిరోదలతో, తిరుగ నేను
అడుగడుగు మొగ్గ రాలిన తోడిమ రాచి
కాడువారిన యెడద రక్తము స్రవించు

ఎడదతేనియ లూరెడి నుడులపూల
డోలికలలోన నన్ను నుయ్యాల లూచి
పదివసంతాలఁబ్రదుకె నివాళి యిడిన
హృదయసారథికై యేడ్వనేని లేను

ఒక్కగడియేని విశ్రాంతి దక్క ఎంత
పెనగులాడిన వివశమై చనెడుకాల
చక్రవిభ్రమణంబులో సాగిపోయి
ఊరకే పుత్తు వట్టినిట్టూర్పుగాడ్పు

పొగులుచుండిన హృదయాన ముగిలియున్న
స్మృతిలతావితానమునకు చిన్నిపాదు
కట్టి, మనసార కన్నీరు కార్చ నాకు
తెరపి దొరకదు నవ్యనాగరకజగతి

౮

పార్థసారథి బ్రదికిన పదిదినాలు
పాలకడలి తరంగాల పైని మిసిమి
పండువెన్నెలరేకు లోపలి వసంతు
పైరగాలి హృదంతర పరిమళమ్ము

అపుడు నే పూలపడవనై హర్ష జలధి
నింగి దాకి తూగాడు తరంగపంక్తి
ముమ్మరమ్ముగు రేఁకలకమ్మదనము
చిమ్ముకొనిపోతి ఆశల చివర లోరసి

ఇపుడు శ్రావణమేఘుడ; ఎడదబరువు
నీడ్చుకొనుచు, జీవితపథ మూడ్చిచనుచు
పిడుగుమ్రోతగ నేడ్చెను ప్రిదిలి దిశలు
ఆర్ద్రసంకములై పోయి అవని గలియ

ఈ వియోగవిషాదాగ్ని యేపుమిగిలి
మహితసంసారసాగరమథనజాత
కాలకూటమహానలముల వోలె
తిరుమఁకొని యేర్చు జీవితపురము లన్ని

తోడివారి జీవితపరితోషమునకు
అంతరంతరమును గాల్చు ననల మంత
కరడుగా గట్టి కంఠసన్నిహితముగాక
కమిచి లో నడచెదు కాలగళుని భంగి

నేను నటరాజు నై తిని; పైని దోచు
లాస్యతాండవనాట్య విలాసములనె
లోక మొగుగును గాని, నాలోన నరము
నరము కాల్చు నీ దుఃఖాగ్ని నాకె యెరుక

జలజల రాలపై స్రవియించు సెలయేరు
నా పార్థు నడిగిన నవ్విపోవు
ఆమనితోటలో నలరుగుత్తుల దాగు
కోయిల నడిగిన 'కో' యని చను
భ్రమరవిన్యాసవిభ్రమలోల పూబాలఁ
గదపి పృచ్ఛింపంగ కందిపోవు
చివురుగొమ్మల చెమ్మచెక్కులో రవగాలి
నుడువగానీదు నా నోటిమాట

పుత్త్రశోకాతురనై నే ప్రొద్దుప్రొద్దు
వనము సందున గ్రుమ్మర ననద వోలె
ఎవరి ధోరణి వారలే యెరుగ నటుల
కనికరముతోడ నా ప్రశ్న వినగబోరు

ప్రాతగోదావరీదేవి! పుణ్యవతివి
గతశతాబ్దాల కష్టసుఖాల నెల్ల
ఒడగట్టిన జీవన వోసుగాత్రి!
ఆలకింపుమ సుంత నీ యలలు నిలిపి

పొంగిపోవదు గద నీ యపూర్వశోభ
కెప్పుడును, లోన గీర్తించి యెన్నిసార్లొ
నీ పవిత్రావగాహనోన్నద్రిశక్తి;
నిన్ను వేడుదు నమ్మ ఆపన్నుడ నయి

పదిశరత్తులపాటు నా బ్రతుకు వెలుగు
గా నటించిన తనయుండు కన్నుమోడ్చి
నీదు సైకతోత్సంగాన నిదురపోవు
అన్నపున్నెము లెరుగడు; వెన్నయెడద

నీవు శీతలకరముతో నిమురుచుండి
సంధ్యసంధ్యల నాత్మవిశ్రాంతి కొరకు
ప్రార్థనలు సల్పవే యమ్మ! పార్థు డింక
అమృతపదవీవిహారియై అరుగు సుమ్మ!

ఊ.వి

బ్రదుకునాళుల కోకిలస్వరముతోడ
బాలికాకంఠమాధురి పాడుకొలిపి
నేను రచియించు గీతు లెన్నని పాడి
మోదవారాశి నైచితి మునుక లెన్నొ

నీ వియోగానలజ్వాల నిగుడ బాగులు
హృదయవేదన తీర్చుకో నేడ్చు కొరకు
స్మృతివిపంచీగళమ్మునే చీల్చు శోక
గీతు లెన్నని నీకయి గిలుకు దిపుడు

ఏ యమర్త్యపథాంతర మిపుడు నీని
వాసమో! నీదు ప్రేమప్రవాహ మింక
మాకునై వెల్లివిరియునా! మాదు రోద
నములు నీ వింక నెరుగుదే? మము దలంతె

కలుగు జగదంతరము దాటి కనలు నాదు
శోకగీతులు నీచెవి సోకెనేని
నన్ను నేమని తలతువో! నాకు మాత్ర
మది యొసంగద ఒక్కింత యాత్మతృప్తి

౧౩

ఈ వియోగాగ్ని మండెడు నెడద కింత
చల్లదన మిచ్చునను భ్రాంతి చందన మని
పులుముచున్నాను పంకంబు; పొగలు వోక
రగులుకొనియెడు లోలోన రాజిరాజి

ఏముహూర్తము నందైన నెగసి, మంట
లాకస మ్మంటగా లేచి, అడలు నాదు
జీవితాశయహర్మ్యాలఁ జిచ్చువెట్టి
కాల్చివైచునో జాడలే కానకుండ!